# శ్రీ ప్రభాకర శతకము

[మత్త కోకిలలు]



రచయిత:

మద్దూరి పాపారావు

శ్రీ పల్లేటి సత్యనారాయణమూర్తిగారి
ధనసహాయమువలన ముద్రింపబడియె.

కాపీ రైటు రిజిష్టర్డు] 1949. [వెల 0-.

19

# శ్రీ ప్రభాకరశతకము.

ఇయ్యది

శ్రీ సద్గురు అయినపర్తి వెంకటసుబ్బారావు మహాత్ములవారి

శిష్యుడును - మద్దూరి సాంబయ్యగారి కుమారుడును అగు

పాపారావు

వలన రచియింపబడి

బ్రహ్మశ్రీ పల్లేటి సత్యనారాయణమూర్తిగారి

ధనసహాయమున సచ్ఛాప[illegible]

ప్రకటింపబడియె.



మొదటికూర్పు 1000

 1949 [వెల 0-3-0

బొలిశెట్టి వెంకటరమణయ్యగారి

భాష్య ముద్రాక్షర శాలయందు

ముద్రింపబడియె

ఇన్నీసుపేట, రాజమండ్రి.

5—5—1949

# పీఠిక.

భక్తసోదర - సోదరీమణులారా!

ఈప్రభాకరశతకంబు దివాకరానుగ్రహంబున, అల్పజ్ఞుడనయ్యు రచించి భాస్కరునికి కృతినొసంగి ఆదినారాయణుని పాదపద్మముల సమర్పించుకొంటిని.

దేహారోగ్య మూలకారణుండును యిహపరసాధనోపాసకుండును, ప్రత్యక్షదైవంబునగు యీసూర్యనారాయణమూర్తిని స్తోత్రింబులవరించి స్మరించి, తరించ, రచించినందుల కన్యథా భావింపక నాదరింతురుగాత.

ఇందలి దోషంబుల క్షమించి తెలిపినచో ముందు సవరించుకొనుచు నాకృతజ్ఞతను దెల్పుకొందును.

ఇయ్యది ముద్రింబునకు తమతండ్రిగారును మాబ్రహ్మగారునగు కీర్తిశేషులైన బ్రహ్మశ్రీ పల్లేటి సత్యన్నారాయణమూర్తిగారి జ్ఞాపకార్థము వారిపుత్రులగు బ్రహ్మశ్రీ పల్లేటి సత్యన్నారాయణమూర్తిగారు ముద్రణ కర్చులభరించి ప్రచురింపజేసినందులకు వీరికిని వీరికుటుంబమునకు శ్రీసూర్యనారాయణమూర్తి సర్వాభీష్టములు నెరవేర్చుగాతయని ప్రార్థింపుచూ వీరికి నా హృదయపూర్వక ధన్యవాదము లర్పించుచున్నాను.

శింగవరం
31—12—1945

ఇట్లు
బుధజనవిధేయుడు
మద్దూరి పాపారావు

## పల్లెటి సత్యనారాయణమూర్తిగారి జ్ఞాపకార్థము.

తే॥ గీ॥ శ్రీయు వాణియు నింట వసింప భటులు
బంధు మిత్రులు పుత్రులు పౌత్ర బుధులు
గూడివర్ధిల్లు పల్లెటి కులము విడిన
సత్యనారాయణాత్మకు శరణు శరణు

ఉ॥ కోటిజొహార్లు జేసెదను కోవిదుడై యశశ్శేషుడైన ప
ల్లేటి కులాబ్ధి సోముదు కులీనుడు బ్రాహ్మణ సత్యదేవునిన్
జాటగ వీరి జ్ఞాపకము శాశ్వత మొందగ జేయు పుత్రుడీ
పాటల ముద్రణంబునకు భారముదాల్చియశంబు గూర్చుటన్

ఉ॥ దేవ వసిష్ఠ భూసుర యిదే గొను వందనమాత్మ ప్రేమతో
దీవెనలిమ్ము భక్తిని విధేయుడనై మిముగొల్తు గాని మీ
జీవితమందు నీవిధిని సేవలు జేయక ద్రోహినైతి నై
నా? వినుతింతు మిమ్ము సుజనావన దప్పుశమించ నెంచుమా

మ॥ జనులందెవ్వరి కెట్టి గోర్కెలను నీ సాన్నిధ్యమున్జేరుచున్
మనవుల్ సేతురొ గుప్తదానములతో మానంబుగా దీర్చి నీ
వినయంబున్ భువిజూపి కీర్తి పతివై విద్వాంసువై బ్రహ్మ పా
వనుడా నిన్ను భజింతశిష్యులకు దేవా సత్యనారాయణా

తే॥ గీ॥ స్థిరముగా భక్తి బెంపొంద గురువినామ
ము నిరతంబు నిలుపగాను ముద్రణకగు
కర్చుభరియించు గురుపుత్రు ఘనతగూర్చి
మ్రొక్కి గురుసేవజేతు న మో యటంచు

ఇట్లువిధేయుడు
గురుచరణసేవకుడు
మద్దూరి పాపారావు.

శ్రీసద్గురు రాధాకృష్ణ పరబ్రహ్మణేనమః

శ్రీ ఉషా, పద్మినీ, ఛాయా, సమేత శ్రీసూర్యనారాయణ పరబ్రహ్మణేనమః

## మత్తకోకిలలు

శ్రీదివాకర భానుమూర్తి భజింతు ♦ నిన్ను కృపాబ్ధితో
నాదరింపుము వృత్తజాతుల ♦ నామదిన్ బదపూజలన్
సాదరంబుగ మత్తకోకిల ♦ జాతితోడను సేతుగా,
మోదమొందియు లోకరక్షణ ♦ ముందుసేయు ప్రభాకరా॥

శ్రీగణేశుని భారతాంబను ♦ చిత్తమందున గొల్చెదన్
త్యాగమూర్తుల సంస్కృతాంధ్రుల ♦ సత్కవీంద్రుల మ్రొక్కెదన్
రాగశూన్యుని మద్గురూత్తము ♦ రమ్యతన్ గడియించెదన్
వేగనామదిగోర్కెదీర్పుము ♦ విశ్వదాత ప్రభాకరా॥

శ్రీ పరాత్పర నిన్నుబెద్దను ♦ జేసితీకృతికంతకున్,
బాపదూరుడవంచు నంకిత ♦ భారమిచ్చితి నీకెగా
జూపిప్రేమనుశబ్దకోటిని ♦ సూనృతోక్తులనివ్వుమా
నీపదంబులనమ్మినాడను ♦ నిర్మలాత్మ ప్రభాకరా॥

శక్తిహీనుడ విద్యలేదిల స ♦ ర్వసాక్షి నుతింపరా
భక్తినెంచియు నీపదంబుల ♦ భారముంచితి నెపయిన్
ముక్తిగోరెద నీదుశక్తిని ♦ ముందునిచ్చిన నేనె యా
సక్తితో విరసింతునెల్లరు ♦ సంతసింప ప్రభాకరా॥

లోకపావన, లోకపాలన ♦ లోకలోచన భాస్కరా
లోకచీకటి తెల్లదోలెడి ♦ లోకదీపిక గావరా
లోకజీవముల లన్నియేలెడి ♦ లోకవంద్య దివాకరా
లోకబాధల ద్రుంచినను నీ ♦ లోనజేర్చు ప్రభాకరా॥

కర్మసాక్షివి కాలనిర్ణయ ♦ కర్మలకు మూలంబుగా
ధర్మమూర్తివి మేలుకీర్తివి ♦ ధర్మనేతవు నీవెగా
నిర్మలంబుగ నామపూజల ♦ నీవెనొందుచు మేలుగా
ధర్మముల్ నిలుపంగ బుట్టిన ♦ ధాతనీవె ప్రభాకరా॥

రక్షకుండవు లోకబాంధవ ♦ రాజతేజిని దాల్చుచున్
పక్షమూనక కాంతినంతట ♦ బాగుగా విహరింపుచున్
శిక్షసేతువు మూర్ఖజాతుల ♦ సేవకాళిని బ్రోవగా
దక్షతన్ వహియించి యుండెడి ♦ తండ్రినీవె ప్రభాకరా॥

క్షామబాధ నివారకుండవు ♦ సామినీవు దయానిధే
క్షేమకారణమూర్తి భక్తులం ♦ చే నిరంతర సంధ్యలన్
నీమమెంచుచు నర్ఘ్యదానము ♦ నిత్యమొందెడి దేవ నీ
నామ కీర్తనసేయ బాధలు ♦ నాశమౌను ప్రభాకరా॥

సేవకాళిని బ్రోవనెంచగ ♦ జేతదాల్చినకంకణం
బే వరించియు జూచియుంటుట ♦ నెవిధంబునునీకు నే
భావమిచ్చియు బూజసేతును ♦ భక్తినెంచియు దేవ, నా
జీవితంబును ధన్యవంతము ♦ సేయుమోయి ప్రభాకరా॥

పల్కనుంటెసుమా ప్రభాకర ♦ భక్తితో శతకంబునన్
బల్కులివ్వగనుండినాడవు ♦ భాస్కరుండవు గాచు నీ
పల్కులెప్పుడు బ్రహ్మహత్యల ♦ పాతకాదుల ద్రుంచుచున్
నిల్కడై వతలంబు జేర్చగ ♦ నిల్చెగాదె ప్రభాకరా॥

సర్వశాస్త్రములం దతీతుల ♦ సౌమ్యపండిత మూర్తులన్
నిర్వహింపగ యాజ్ఞవల్క్యుని ♦ నిత్యుడంజనిపుత్రునిన్
గర్వమొందెడివిద్య నేర్పి జ ♦ గాన గీర్తిలుచుండుటన్
మర్వకుంట భజింతు నేపలు ♦ మారులిట్లు ప్రభాకరా॥

నిన్నుజూచుచు నిన్నుగొల్చుచు ♦ నిన్నుసన్నుతులందునన్
నిన్నుపాసనసేయుచుం మది ♦ నిన్నెనమ్మియుగోరెడా
పన్నులౌ ఘనభక్తవర్యుల ♦ బాంధవుండవుయౌచు నీ
సన్నిధానమునందు జేర్చెడి ♦ సామివీవె ప్రభాకరా॥

కంటికానని దేవులెందరు ♦ గల్గియున్నన్ నీవలెం
యుంటిరా గనులందుగన్పడ ♦ నుర్వినెచ్చట జూచినం
బంటుగానను జూచియేలుచు ♦ భారమున్ వహింపుమా
జంటమేనులు నాకునుంగల ♦ సర్వసాక్షి ప్రభాకరా॥

నిప్పు బొగ్గుల నీటనుండియు ♦ నేర్పులేని జనంబులుం
మెప్పులొందగ జంత్రముల్ మహి ♦ మీదసేతురు జూడగం
గొప్పగోరక నిప్పునీరును ♦ గూర్చుకొంచును నీవెగా
దప్పకుండను సేతువెన్నసి ♦ దల్వనేర్తు ప్రభాకరా॥

సాహసంబున దోసకోటిని ♦ శాంతహీనుడనౌచు నే
మోహపాశములందు జిక్కియు ♦ మున్నుజేసితహంబునం
పాహిమాంయని నిన్నువేడితి ♦ భావముల్ గ్రహియింపు దా
సోహమంచును నిన్నుగొల్తును ♦ జూడగోరి ప్రభాకరా॥

కంటికానిన నీవునంతట ♦ కర్మలన్నియు నుండుగా
వంటకాదులు నాకలాది ది ♦ వంబులందు ప్రభుత్వముల్
గంటలన్నియు నీవునుండిన ♦ కాలమందునె కార్యముల్
కంటనీవిక జూడకున్నను ♦ గాఢనిద్ర ప్రభాకరా॥

రామచంద్రుడు యుద్ధభూమిని ♦ రావణుం హరియింపగా
లేమటంచనగా నగస్త్యము ♦ నీంద్రుసత్కృతమంత్రముం
కామితంబుగజేసి విల్లును ♦ గాంచెనమ్మలు నీకృపం
రాము నేలి జయంబుగూర్చిన ♦ రాజరాజ ప్రభాకరా॥

కాయ మెప్పుడు రోగబాధల ♦ గల్గుచుంటను నిన్ను నే
బాయకుండగ గొల్తు నిత్యము ♦ బాధలన్నిట దోలుమా
మాయలందు మునింగి యుంటిన ♦ మాయకుండ నభోమణీ
సాయమీయుము మాయబాటగ ♦ సామిపాహి ప్రభాకరా॥

ఒంటిచక్రము తేరుపైనము ♦ యోజనంబుల దూరమున్
కుంటిసారధి సప్తసంఖ్యగు ♦ గుర్రముల్విన హాశ్యమా
తుంటరాద్యసురాళి నాజని ♦ ద్రోయవలసిన భారముల్
గెంటియేవిధి నిత్యబాధల ♦ గెల్చుదోయి ప్రభాకరా॥

తేరుగుఱ్ఱము లందుగట్టగ ♦ తేజవంతపు పగ్గముల్
ఏరు! జూపిరి లేనిచో మది ♦ కే స్ఫురించిన జూడగా
కోరతాచుల నేలనిందుల ♦ గూర్చితో! గడుభీతిచే
తారుమారయి తప్పె సారధి ♦ దారియేమొ ప్రభాకరా॥

ఎంతకాలము నేరిదెచ్చితి ♦ వీయనూరుని సూతుగా
స్వాంతజేతలొ గాక! నెవ్వరు ♦ చక్రమొక్కటి జేసిరో
వింతలెంచగ లేను మార్గము ♦ వీధి జూడన యోమయం
బెంతకైనను మేలువాడవె ♦ ఏలుదీవు ప్రభాకరా॥

బాటలేకను నేలగాకను ♦ బండినడ్పుట జూడగన్
జాటుచుండె "విమానమో" యని ♦ సందియంబగు "నింజనుల్"
బూటకంపు "విమాన" మందున ♦ బోయెదప్పుదు "తైలముల్"
వేటినొల్లక నీదు తేరిక ♦ వింతబోవు ప్రభాకరా॥

చక్రముల్ మరలన్ని జేసెడి ♦ శాలబెట్టియు నీవె ని
ర్వక్రమైన పరాక్రమంబున ♦ వారిగూర్చియు సర్వముల్
విక్రమంబున జేసి కీర్తిలు ♦ విశ్వరూప భజింతు నా
వక్రబుద్ధిని దిద్ది నేలు భ ♦ వాబ్ధినుంటి ప్రభాకరా।

ఎంతచిత్రము నీమహాత్మ్యము ♦ లెంచసాధ్యము గాదురా
వింతవింతల రంగులుండెడి ♦ విశ్వరూపము దాల్చుచున్
యెంతమందులకైన లొంగని ♦ యెట్టిరోగములైన నీ
చెంత జూడగ మాయమౌను భ ♦ జించిగొల్వ ప్రభాకరా॥

పద్మబాంధవ పద్మవల్లభ ♦ పద్మలోచన బ్రోవరా
పద్మమిత్ర పవిత్ర దీనుడ ♦ భాస్కరా ననుగావరా
పద్మమానసచోర ధోసవి ♦ భంగ నీసరిలేరురా
పద్మసన్నిభ పుణ్యపాద కృ ♦ పా దయాళో ప్రభాకరా॥

పాములన్నియు బాప మానస ♦ బాధలన్నియు దీరగా
పాముకాటు కజీర్ణరోగము ♦ పాండుకుష్ఠు లకన్నిటిన్
కామదోషము కర్మదోషము ♦ గాల్పగాదగు మూర్తివై
నీమముంచియు నేలనెంచిన ♦ నిన్నుగొల్తు ప్రభాకరా॥

దర్శనంబు లభించ హారమె ♦ దార్ధతన్ దినువారలున్
దర్శనంబు లభించకున్నను ♦ దప్పికేనియు ముట్టకన్
స్పర్శసౌఖ్యము జూచువారలు ♦ శాంతమూర్తులు నిత్యమీ
దర్శనంబు సదావరింతురు ♦ దాసకోటి ప్రభాకరా॥

కాలమార్పులసేయుచుందువు ♦ కాలచక్రపు రాసులన్
కాలమూర్తివి యాచునుండి సు ♦ ఖాలనిచ్చి ముదంబుగా
నేలిలోకము వృద్ధినాశము ♦ లీవెసేయ త్రిమూర్తి గా
జాలి చంద్రునిజూపువాడవు ♦ జంత్రచిత్ర ప్రభాకరా॥

నీకు లొంగని రోగ మెచ్చట ♦ నిర్ణయింపగ లేదురా
నీకు నర్ఘ్యము నివ్వకుండిన ♦ నిష్ఠ లెందుకు గాదురా
నీకు గానిది జన్మజూచిన ♦ నిష్ఫలంబు దివాకరా
నాకునీకృపజూపి నేలుమ ♦ నాధనాధ ప్రభాకరా॥

కల్పకంబు లుగంబులు మరి ♦ గాంచ వర్షము ఐనముల్
దెల్పగా ఋతు మాస పక్షము ♦ దీనిధీ దివరాత్రులన్
సల్పుచుందువు కాల గారడి ♦ చక్రమున్ ధరియించు నిన్
నిల్పి గొల్వగనేర నెవ్వరు ♦ నేర్చువారు ప్రభాకరా॥

ఛాయ పద్మిని కాంతలున్ వృష ♦ సాధ్యులందరి గూడుచున్
బాయకుండగ సర్వకాలము ♦ బ్రహ్మవేత్తవు యాచునీ
సోయగంబులజూపి నేలుచు ♦ జూడవింతల నోపునిన్
బాయలేను భజింతుబ్రోవుము ♦ భానుమూర్తి ప్రభాకరా॥

వారిజాసనమూర్తి విష్ణు శి ♦ వాది బేధములొందుచున్
తేరిజూడగరాని వేలగు ♦ దివ్యతీక్షణ కాంతులన్
జేరి లోకముగావనెంచిన ♦ సిద్ధమూర్తి నిన్ను నే
గోరిసేతును పాదపూజలు ♦ కోటితేజ ప్రభాకరా॥

భానుమూర్తి మదీయజన్మల ♦ భాపరాసుల ద్రోలుచూ
జ్ఞానమిచ్చియు ప్రేమతోడను ♦ గాల్పుమా యజ్ఞానమున్
గానలోలుడ వంచువిందు జ ♦ గాన భాస్కర బ్రోవుమా
వేనవేలు నమస్కృతుల్ గొను ♦ వేదవేద్య ప్రభాకరా॥

అప్పవై హృదయాబ్జమందు వి ♦ హారివై ననుగంటికిన్
రెప్పరీతిని గాచి మంచిచ ♦ రించు బుద్ధిని నిచ్చుచున్
దప్పకుండగ నీదు సేవక ♦ దాసులందున జేర్చుమా
యెప్పుడైనను నిన్ను మర్వను ♦ హేరవీంద్ర ప్రభాకరా॥

ముప్పునందున గాలకింకర ♦ మూక జేరియురోగముల్
దెప్పిరంగను లేకబంధులు ♦ దెల్సినేడ్చెడి వేళలన్
మెప్పునొందగ నీకునేను స ♦ మీపమౌదుగా లేనొకో
యిప్పుడేతవ నామపూజలు ♦ నేరచింతు ప్రభాకరా॥

చిత్రగుప్తులు నాదువర్తన ♦ చెడ్డ లేదని వ్రాసిరో
పత్రమందున వారితోడ శి ♦ పార్సు జేసియు పున్నెముల్
మిత్రతన్ లిఖియింపజేసి స ♦ మీపమందున మోక్షమున్
చిత్రభానుడవై యొసంగుని ♦ జేస దేవ ప్రభాకరా॥

జ్ఞానశూన్యుడ నీదు పుణ్యపు ♦ గానమెప్పుడు జేసెదన్
బూనితీశతకంబువ్రాయగ ♦ బొమ్మగా ననునిల్పుచున్
ధ్యాన తన్మయ మందునుండెద ♦ తంత్రీవీవె రచించు కా
దేని నీకును నాకు గల్గును ♦ దేశనింద ప్రభాకరా॥

నీవరంబుల తోడ గాకను ♦ నేర్తునే తవపూజలన్
కావరంబుల దోలిజక్కని ♦ గైతలన్ దయసేయుమా
భావిశాలపు భాగ్యమంచును ♦ బట్టెదన్ తవపాదముల్
గావలేవె సదాస్మరించ జ ♦ గాన మేటి ప్రభాకరా॥

వేదశాస్త్రములందు ప్రజ్ఞుల ♦ విశ్వమందున జూపగా
నాదరించియు యాజ్ఞవల్క్యుని ♦ నాంజనేయుని శిష్యులన్
మోదమందగ జేసి సద్గురు ♦ మూర్తి నాచుఋశంబులన్
సాదరంబుగ నిల్పినాడవు ♦ సారసాక్షి ప్రభాకరా.

పేరుదెచ్చెడి శిష్యులిర్వుర ♦ బ్రీతితోగడియించి నీ
తేరువెంబడి నిల్పివిద్య ను ♦ తింపజెప్పిన నిన్ను నే
తీరుగొల్తును, మానవుండను ♦ దేవ బుద్ధివిహీనుడన్,
నేరమెంచక, నేలి మెచ్చెడి ♦ నీ తినిమ్ము ప్రభాకరా!

పావనుండును యాజ్ఞవల్క్యుడు ♦ పారమార్థిక చింతలన్
సావధానముతోడ శిష్యులు ♦ సార్వభౌముల గొల్వలన్
భావ వాదనలందు గెల్చి శ ♦ భాసనంగను గీర్తులన్
పావనంబుగ సేయరే జన ♦ పాల శాల ప్రభాకరా॥

తేరుపై నము మానకుండగ ♦ తేజమోమును దాల్చియున్
పేరుదెచ్చెడి విద్యజెప్పియు ♦ ప్రేమజూపితివంచు నా
ధారమీవని యెంచి సద్గురు ♦ దాతవీవని గొల్చుచున్
జేరె పావని యాజ్ఞవల్క్యుడు ♦ సేవసేయ ప్రభాకరా

విద్యలందున మేటివీవు న ♦ వీనకోవిద బేరుతో
సద్యశంబును గొంటివంచును ♦ జాలవేడుచు దాసులున్
పద్యరూపము లందుభక్తిని ♦ బాడుచుంటను పాదముల్
గద్యలన్ పఠియించి గొల్తును ♦ గాలరూప ప్రభాకరా

వేయి చేతుల రేడవీవని ♦ వేదవేద్యుడ వంచు ని
న్బాయకుండెడి సంధ్యలందున ♦ బ్రాహ్మణోత్తమ పూజలా
మేయనొందుచు గీర్తిగాంచి ప్రభ ♦ మింపజేసి త్రికాలముల్
సేయుచుందువు నీదుప్రజ్ఞల ♦ జిత్రవర్త ప్రభాకరా

ఆహవంబున నీమమంత్రము ♦ లాశ్రయించిన నెల్లరున్
మోహపాశములందు జిక్కక ♦ మోదమొంది జయంబులన్
బాహుశక్తిని గెల్పునొంది న ♦ పారకీర్తిని గూడెదున్
పాహిమాం చలిదాయ రా నిర ♦ పాయ మూర్తి ప్రభాకరా

పుత్రునొక్కని త్రేతనాలపు ♦ భూమియందున గాచి నీ
పుత్రునొక్కని "ద్వాపరంబున" ♦ బోరులో మడియింపగా
చిత్రమైగన నీదుప్రజ్ఞల ♦ జేయుజేతలజూడగా
మిత్రశతృలులేరునీకు సు ♦ మీ నిజంబు ప్ర॥

సారమెంతయులేకబోయిన ♦ సత్యముల్గనలేక సం
సారమందున మోహభ్రాంతిని ♦ జాలజిక్కితి నింకవే
సారిబాధలనొందలేకను ♦ సాంద్రమున్ దరిజేరగా
గోరి నీపద నావబట్టితి ♦ గూర్మిబ్రోవు ప్ర॥

చావు పుట్టుక లేని దైవత ♦ సార్వభౌముడవై
జీవితంబున జక్కనాడవు ♦ జేసినట్టి తపంబులన్
పావనాంగుడవైన నీపద ♦ భక్తిచేగదుధన్వతర్
దేవజెందితి బ్రోవుమానను ♦ దీనపోష ప్ర॥

సాగరంబుల నుప్పునీటిని ♦ జంత్రముంబలె దీయుచున్
బాగుజేసియు మంచినీటిని ♦ బంచి మేఘములందునన్
వేగమే వడగండ్లు సేయుచు ♦ వేడివేలుపు పేరునన్
త్యాగివై భువి వర్షమెల్లెడ ♦ ధాత్రిముంపు ప్ర॥

సస్యజీవము లన్నినిల్పగ ♦ జక్కగా వర్షింపుచున్
వస్యజీవుల జేసికొంటివి ♦ వంద్యమానవకోటులన్
కస్యపాదిమహామునీంద్రుల ♦ కణ్వ గద్యలభాసిలన్
దృస్య మద్భుతమాయె గొల్తు ను ♦ ధీమహేంద్ర ప్ర॥

నీకు వందనమాచరించిన ♦ నిల్వబోవవు రోగముల్
నీకు వందనమాచరింపక ♦ నిల్వబోవవు భోగముల్
నీకు పూజలుసేయకున్నను ♦ నిల్వ వెంతటి పున్నముల్
నీకు గానివి లోకమందున ♦ నెవ్వి లేవు ప్ర॥

బాపనయ్యల సంధ్యనిచ్చెడి ♦ భక్తినర్ఘ్యపునీటికే
జూపువాడవు సంతసంబును ♦ సూర్యనామము బొల్చుచున్
ప్రాపుతోడను లోకమేలెడి ♦ పాలకుండవునైన నీ
రూపుజూడగ చిత్రమౌగద ♦ రూఢిదేవ ప్ర॥

రెప్పపాటును నొక్కచోట మ ♦ రేమినంచక నాగకన్
యెప్పుడున్ పయనంబుబోవుచు ♦ నేత్రమల్ గని జెందకన్
యొప్పుగాగడు దూరభారము ♦ యోజనంబులు దూకుచున్
మెప్పునొందగ నాకుగప్పుడు ♦ మీ కృపాబ్ధి ప్ర॥

శ్రీ ధరాత్ముడ వైనసీకృత ♦ చిత్రరీతుల జూడగన్
బోధగాకను వెర్రినైతిని ♦ పూర్వపుణ్యము చేతనీ
మాధురంబగు నామమంత్రము ♦ మానసంబున నెంచెదన్
సాధుబాధల ద్రుంచినన్ మన ♦ సార బ్రోవు ప్ర॥

భారరూపుల వేల్పుడంచు కృ ♦ పాబ్ధి నామము లొందుచున్
దూరమెంతయు నున్న తమ్ముల ♦ తోడ మైత్రిని సేయుచున్
కూరిమిన్ భువిజూపి మానవ ♦ కోటిబుద్ధులదిద్దగన్
గోరిజేసెదు నీదుజేతల ♦ కున్ జొహారు ప్ర॥

దేవకోటికి పట్టుగొమ్మవు ♦ దేవతాంశలు సర్వమున్
తావరంబుగ నుండెనీయెడ ♦ ధాత విష్ణువు శైవునున్
గావలోకము హస్తమందున ♦ కంకణంబుధరించెదున్
నీవలెన్ పరులేరులేరని ♦ నినుగొల్తు ప్ర॥

నూరులెల్లను వీరస్వర్గము ♦ జూరగొంటకు మార్గమున్
జేరముందుగ నిన్నుజూడక ♦ దీరదంచు శ్రుతుల్ సదా
దారియందుననీదుదర్శన ♦ ధన్యతన్ తిరవాసమున్
పోరులేకను దారితప్పక ♦ బోవుగాదె ప్ర॥

కన్నగానక కావరంబున ♦ కల్మషోన్మదవర్తినై
తెన్నుగానక జూచి నేతవ ♦ దివ్యపాదముబట్టితిన్
మిన్నునున్నను నీదుప్రేమ స ♦ మీపమందున యుంచునా
న్నధైర్యము నీకటాక్షమె ♦ యుర్విలోన ప్ర॥

చ్చగుఱ్ఱము నెక్కి దిగ్గుచు ♦ ప్రాగ్దిశన్ బొడసూపుచున్
చ్చిబోదువు పశ్చిమాద్రికి ♦ వాంఛతో నిరతంబు నీ
రచ్చలందున మాసికోటి స ♦ రాసరిన్ ఘనభక్తితో
హెచ్చుగీర్తుల వేదమంత్రము ♦ వెల్లడాడ ప్ర॥

రేవెలుంగుల జోడు వీవన ♦ రే మహాత్ములు బాంధవా
పావనాంగుడ వంచు నెంచియు ♦ పండితాళి భజింపరే
భావమందున నుండి జన్మకు ♦ పారమార్థిక చింతలన్
బోవుమార్గము జూపనెంచుము ♦ పుణ్యదాత ప్ర॥

నీవులేకను నిల్వ నేరము ♦ నీవుగాకను లోకముల్
లేవు జీవులు సర్వసస్యము ♦ లీధరాస్థలి యేమియున్
రావుజూడగ సర్వవస్తులు ♦ రాజసంబులు కర్మలున్
బోవు భాస్కర బుట్టనంతకు ♦ పుణ్యజన్మ ప్ర॥

పోతు జక్కని యెక్కి బోయెడి ♦ పుత్రుగాంచియు ధర్మసం
ప్రీతివానిని ధర్మరక్షణ ♦ బేధమెంచక సేయుగన్
నీతినిచ్చియు దక్షిణంబను ♦ నేలనేలగ బంచి నీ
ఖ్యాతి నిల్పితివీజగంబున ♦ కర్మసాక్షి ప్ర॥

ఛాయ మానస చోరుడనుచును ♦ జాటుచుంట సుశాస్త్రముల్
శ్రేయమార్గము జూప నీపద ♦ సేవ సేతును ప్రేమతో
మాయ లెల్లను ద్రోసి సుకృత ♦ మార్గమున్ దరిజేర్పుమా
న్యాయమెంచియు దీనజన్ముడ ♦ నాథ పోష ప్ర॥

పాప పుణ్యము లెల్లజూచెడి ♦ బ్రహ్మవేత్తవు నైన నీ
ప్రాపకంబున ముక్తి జేరగ ♦ భావమందున నెంచెదన్
జూపినీ కరుణామృతంబును ♦ సుస్థిరంబుగ బ్రోవుమా
మాపుదోషములెల్ల నాదర ♦ మా నుతింప ప్ర॥

నీవె సర్వసుపర్వులౌదువు ♦ నీవె దిక్పతులౌదువా
నీవె తారగ్రహంబు లౌదువు ♦ నీవె సాంద్రము లౌదువా
నీవె మూర్తుల మూడురూపులు ♦ నీవె లోకములౌదువా
నీవె జూడి సమస్త జూపుల ♦ నిన్నెజూతు ప్ర॥

# ప్రభాకర శతకము

కన్నుమూసిన కన్నుజూచిన ♦ కాంతులెల్లడిప్రాప్తమై
మిన్నుజూచిన తెన్నుజూచిన ♦ మేలురూపు ప్రదీప్తమై
విన్ననీదగు గాథశ్రోత్రపు ♦ విందుసేయగ సోద్యమై
యెన్నలేకను నుంటినీఘన ♦ తెంత యుండె ప్ర॥

చావు పుట్టుకలందు జిక్కని ♦ జాలు గానిది దోసముల్
దేవ సేయుచునుంటి బ్రోవను ♦ తింపుచుంటిని నీకృపన్
చావు పుట్టుక లొల్లకుండెడి ♦ సత్పథంబున బెట్టుమా
గావకున్నను నిన్నువీడను ♦ గాలరూప ప్ర॥

పుట్టు చావులు లేనిరీతిగ ♦ బ్రోవశక్తియులేని చో
గట్టిగా ననుబట్టుకర్మల ♦ కారణంబున జన్మముల్
బుట్టదప్పనిదైన నీపద ♦ పూజలందున ప్రేమలున్
బుట్టజేసెడి జన్మమివ్వుము ♦ బ్రోచినాకు ప్ర॥

దొంగకూటము "మారు" మామకు ♦ దోడుగా నీవుంటచే
వంగడంబును మంచిదై సహ ♦ వాసదోషము యబ్బె హ్యా
ద్రింగమందున నీదుపూజ ని ♦ రంతరంబును సేయగా
లొంగి నీకృప జూపవా విమ ♦ లోజ్వలాత్మ ప్ర॥

నన్ను గావక నీవుపేక్షగ ♦ నాలసించిన భక్తితో
నిన్నుగట్టియు మానసంబున ♦ నిల్పువాడను భాస్కరా
పున్నెమైనది నీదునామము ♦ పూజలెన్నియు జేసినన్
నన్నుగాదని యూరకుండుట ♦ నాయమానా ప్ర॥

పొట్ట నింపెడి విద్య నేరక ♦ పోయినా తవభక్తులన్
బెట్టుచుందువు బాధలన్నిటి ♦ బీతిపీడక నాత్మలో
యెట్టిచోటులకైన జేర్పగ ♦ నెంచి కష్టసుఖంబులన్
గట్టిగుద్దుచు నీ పరీక్షల ♦ గాంచుదీవు ప్ర॥

ఇంట మందులు లెక్కసేయక ♦ నేరినో కడు వేడెడా
తుంటరాత్ముల రీతి గంటికి ♦ ద్రోపు నిన్ను భజించకన్
కంటికానని వేల్పులెందరి ♦ కాంక్షతో బ్రిదిమాలినన్
యుంటునా ఫలమెన్నడైన ద ♦ యామయాయ ప్ర॥

కొంచెమేని తిరంబులేకను ♦ కోతి తీరుగ నుండి నన్
మించిబోయెడి మానసంబును ♦ మేటినీపద వాంఛలం
దుంచి శుద్ధిగజేసి జూపుము ♦ యున్నతోన్నతభావముల్
యెంచబోకుము దోషినంచు స ♦ హించి బ్రోవు ప్ర॥

నూరువర్షము లాయువుంట వి ♦ నోదమొంద నిత్యమున్
జేరువన్ వసియించు మృత్యువు ♦ చిత్రవైఖరి జూచుచున్
తిరుగాంచియు నెల్లవేళల ♦ దేవనీపదసేవలన్
గోరిజేసిన జన్మకీర్తిని ♦ గూడిగాదె ప్ర॥

ఎంతకాలము నున్నదప్పుడు ♦ యెప్పుడో మరణంబురా
చింతనొందక నీదుసత్పద ♦ సేవసేయక గాదురా
చెంతనున్న మహాత్ముడీవని ♦ సిద్ధునిన్ నినుగానకన్
ఎంతజేసిన నేమి నిక్కము ♦ నెంచకుండ ప్ర॥

నామరూపము బేధమెంచక ♦ నామపూజల సేయుచున్
కామితంబుల మీరిసత్యము ♦ గాంచి ధర్మము లెంచినన్
తామసంబు పరిత్యజించి వ్ర ♦ తంబులన్ మరిజేసినన్
బాములన్నియు బాపినీపద ♦ భాగ్యమిచ్చు ప్ర॥

కాలమంతవృధా ప్రయాసల ♦ గప్పియుంటి దురాత్మునై
జాలమాయెను సేవలింతకు ♦ సల్పకుంటి మహాత్ములన్
జాలవేడియు గుర్తుగాంచితి ♦ సర్వసాక్షి భజించి నీ
పాలజిక్కితి నేడుజూడు కృ ♦ పావలోక ప్ర॥

కర్మ లెందుకు సేయుచుంటివో ♦ గావ, జన్మలు లెందుకీ
ధర్మముల్ జనియించుచుండెనో ♦ తథ్యమెంచగ లేనురా
మర్మమెంచక నీరహస్యపు ♦ మంత్రమేర్పడ జెప్పరా
కర్మలేకను జన్మరాకను ♦ గాచిబ్రోవు ప్ర॥

ఎండవానలకోర్చి కామ్యము ♦ లెల్లనీడ్చి తపంబు భూ
మండలంబున యెంతయేని శ్ర ♦ మంబులొందియు జేసినన్
దండమున్నను నిన్నుగాంచియె ♦ దార్థమెంతురె దేవతా
పండితాళియు నైననీఘన ♦ ప్రజ్ఞ లెల్ల ప్ర॥

రాజవై గ్రహకోటి కెల్లను ♦ రాశిచక్రము దాల్చుచున్
తేజిమోహమును దాల్చి వేదము ♦ దేశికాక్యను జెప్పుచా
వ్యాజమైన కటాక్షవీక్షణ ♦ వాంఛలంజవిజూపుచున్
పూజనీయుడవైననిన్నని ♦ బుద్ధి నెంతు ప్ర॥

దప్పుబోవవు కష్టసౌఖ్యపు ♦ ధర్మముల్ భువిసంచు బో
జెప్పగా గ్రహణంబులందున ♦ జెందుచుందువు బాధలన్
గొప్పవాడవు రాహుకేతుల ♦ కున్ భయంబడ మేమికన్
దప్పువారమె కర్మనొందక ♦ ధైర్యమిమ్ము ప్ర॥

చావు బుట్టుక కర్మలొందక ♦ సర్వదేవత కోటి స
త్స్వహంబగు కామరూపము ♦ దాల్తురంచ ను వాక్యముల్
లేవు నీకొండ కల్ల వేషము ♦ లేయనొక్క విధంబుగా
నీవు యుంటను సత్యనిత్యుని ♦ నిన్నుగొల్తు ప్ర॥

కుక్షి పోషణకై యనేకము ♦ కోటు వేషము లేసి ప్ర
త్యక్షమా నినుగాంచి మ్రొక్కుచు ♦ ధన్యులై తవదాసు
పక్షమూనియు నీదుకీర్తిని ♦ పద్యగద్యలబూజలన్
రక్షకుండవటంచు గొల్చెద ♦ రాదిదేవ ప్ర॥

మోక్ష మార్గములో నివాసవు ♦ మూర్తి వౌటను ప్రేమతో
సాక్షివై ఘనచిత్రగుప్తులు ♦ సాహసంబున బావముల్
నేక్షణంబున వ్రాయకుండగ ♦ నిర్ణయించియు బత్రముల్
దీక్షతోడ పరీక్ష జేసియు ♦ దిద్దుమోయి ప్ర॥

దారిమధ్యను నీవుయుంటను ♦ దర్శనంబుల సేతు వే
సారియుంటను మర్చెదో గడ ♦ సారిమ్రొక్కుట భాస్కరా
మారువల్కక యున్ననీవు బ్ర ♦ మాదమొందక దీవెనల్
జేరదీసియునిచ్చి ముక్తికి ♦ జేర్చుమోయి ప్ర॥

పేరు లెన్నియొ నుండె నీకని ♦ పెద్దలెల్ల వచించెడిఁ
వేరు వేరుగ బారరూపుల ♦ వింతమాసము లందునఁ
బేరులొందుచు నుంటివందురు ♦ ప్రీతితో తవనామముల్
గోరిబల్కిన నీప్సితంబుల ♦ గూర్చుదండ్రు ప్ర॥

బంధనంబులు నాశనంబగు ♦ భాస్కరానిను గొల్వగా
నంధకారము లెల్ల వోవు సు ♦ మార్క దేవజనింపగా
బంధుప్రేమల కందెనపద ♦ భాగ్యమున్నను లోకసం
బాధమోహము లెల్ల వోయి శు ♦ భంబుగల్గు ప్ర॥

లోపమెంచకు దీనుడన్ ముని ♦ లోల నెంతటివాడ నీ
ప్రాపుజూపుము కోపముంచక ♦ భానుదేవుడ వంటిరా
పాపసంఘములెన్నియున్నను ♦ పాదసేవల దగ్ధమై
రూపుమాసెను బ్రోవు నేను ప ♦ రుండగాను ప్ర॥

ఆశలొందితి రాజ్యభోగము ♦ లందు నర్థములందునఁ
లేశమైనను దృష్టిలేని బ ♦ లిష్టమైనది కాంక్షయుఁ
రాశిచక్రపు రాజువీవట ♦ రాజసంబున గాంక్షలా
వేశమొందని తీరుసేయుము ♦ విశ్వనేత్ర ప్ర॥

సేవ జేసినవాని కేమియు ♦ జేతికివ్వకు మా నహో
సావధానముతో ఢగాంచవ ♦ సానమందున నేనియుఁ
జీవకోటిని మోక్షమార్గము ♦ జేర్చగాదయజూపు రా
జీవమిత్రుడవంచు మ్రొక్కుచు ♦ సేవ సేతు ప్ర॥

పుట్టు చావులుగల్గు దేహము ♦ పోష ణేవిధి జేసినఁ
మట్టిలోబడ దప్పదెన్నడు ♦ మాటలే తిరమానురా,
పుట్టిచావని తావునిచ్చెడి ♦ పుణ్య దేవుడవంచు నిఁ
బట్టినాడను గట్టినాడను ♦ భావమందు ప్ర॥

మాయలోగల గర్భమందున ♦ మాయగప్పియు బుట్టుచుఁ
మాయలోకమునందు జేరియు ♦ మాయచే వర్తింపుచుఁ
మాయ లేలను మాయలొల్లని ♦ మార్గమిచ్చియు బ్రోవగా
జేయనొల్లనివాడవా? దయ ♦ సేయు ముక్తి ప్ర॥

దారపుత్రులు పౌత్ర సోదర ♦ ధాన్య భూములు విత్తముల్
జేరుముక్తికి దారికడ్డుగ ♦ జేయువారలె ధాత్రిలో
దారులన్నియు దీయ నీపద ♦ దాశ్యముండిన జాలుగా
జేరముక్తికి మూలమంత్రపు ♦ సిద్ధియున్న ప్ర॥

యాజ్ఞవల్క్యగురుండ వౌటను ♦ యాజ్ఞవల్క్యడనొచు నీ
యాజ్ఞలెంచి వరించి బుట్టితి ♦ నాదినిన్ను భజించెదఁ
ప్రాజ్ఞుడీవని పాదపూజలు ♦ ప్రార్థనంబుల సేతునీ
యాజ్ఞ జేసియు బుద్ధినిచ్చి ద♦ యార్ధయేలు ప్ర॥

బాధలొందెడి జన్మలింకను ♦ గావరా జగధీశ్వరా
సాధుతాపస సేవలిచ్చియు ♦ సత్పధంబున జేర్పరా
బోధజేసియు నీమభక్తుల ♦ బుట్టసేయగ జూడు నీ
గాధలెల్లను వింటి నమ్మితి ♦ గావరార ప్ర॥

సంచితార్థ కృతాదికర్మల ♦ జాలజేసియు మానసం
బుంచి నీపదపద్మమందున ♦ నొజ్జవంచును జేరితిన్
దంచె దేను భవంబులన్ పద ♦ దాశ్యవృత్తిని దేహమున్
యుంచినా డెమకింకరాళికి ♦ నొప్పగించ ప్ర॥

అల్పబుద్ధుడ నిద్దినంకిత ♦ మార్య జేసి భజించి సం
కల్పకార్యముదీర్చుకొంటిని ♦ గానలోలసుధానిధే
నిల్పిభక్తిని "మత్తకోకిల" ♦ నిర్ణయంబులనూటికిన్
స్వల్పమెచ్చగ బైననిచ్చితి ♦ జాలిజూడు ప్ర॥

పాదపూజలు వృత్తజాతుల ♦ భాగ్యమంచును జేసి నే
మోదమొందితి మత్తకోకిల ♦ ముద్దువృత్తపుదండలన్
యాదిదేవుడవంచు నీమెడ ♦ యందు జేర్చితి నేవరున్
ఆదరించియు గాన్కలిమ్ము మ ♦ హాత్మనాకు ప్ర॥

కర్త నీవని లోకరక్షణ ♦ కారకుండవటంచునీ
వర్తనంబుల జూచివించు భ ♦ వాబ్ధిదాటగ నెంచితిన్
కర్తకర్మల కెల్లమూలము ♦ గాంచి జూడగ నీవె నా
భర్తవై కృపనేలి బ్రోవుము ♦ పాహి పాహి ప్ర॥

పాహిభాస్కర పాహిమాంరవి ♦ పాహిమాంద్యుమణీ మణీ
పాహిభాను సహస్రలోచన ♦ పాహిమాం తరణీమణీ
పాహిమాం జగదీశవల్లభ ♦ పాహి పాహి దివాకరా
పాహిమాం ననుబ్రోవుమా నిను ♦ బాయలేను ప్ర॥

ఎన్ని వ్రాసిన నీపదంబుల ♦ నెన్ని పూజల జేసినన్
దిన్నగా హృదయంబునందున ♦ దీరదామెర భ్రాంతి వా
కెన్నడీకృపజూప నెంచితి ♦ వేమొ దోపదు వేచి నే
యున్నవాడను ఏమిజేసెదో ♦ యుంచు పేరిమ ప్ర॥

## ప్రభాకరశతకము

వ్రాసియుంటిని నీకు గీతలు ♦ వందనంబులు సేయుచున్
దోసిలొగ్గితి పుణ్యనీపద ♦ తోయజంబుల గొల్చుచున్
నీసమానులు లేక మేటివి ♦ నీవటంచును నమ్మితిన్
దాసుడైతిని నన్ను బ్రోచుట ♦ దప్పదింక ప్ర॥

ముందు జేసిన పూర్వపుణ్యము ♦ మోక్షదాయకయుంటచే
పొందుగానిను బూజ జేసెడి ♦ పుణ్యభాగ్యము గల్గెగా
వందనంబుల సంతసించెడి ♦ వాడవీవు కృపాకరా
చందమామకు జోడునీవని ♦ సాధులందృ ప్ర॥

లోకమందలి పాపులందరి ♦ లోన నేనె కృతఘ్నుడన్
సాకనీవె! మహాత్ముడంచును ♦ సాక్ష్యమెంతయొ నుండుటన్
నీకు నేను పదాంకితుండను ♦ నిశ్చయంబుగ నెతిరా
రాక, దీరదు నీకు నాకు వ ♦ రంబులివ్వ ప్ర॥

దాచియుంచిన భక్తియంత యె ♦ దార్థతన్ జవిజూచి నో
బూచులాడక కీర్తినిల్పియు ♦ బ్రోచి నీకృపజూపరా
రాచబిడ్డవు బ్రోవకున్నను ♦ రాజసంబదియేలరా
నీచు నేలుటె ధర్మమార్గపు ♦ నీతిగాదె ప్ర॥

కొంచమైనను భక్తిదప్పక ♦ గోరి సేవలునీవు జే
యించుకొంటకు నేను జేయుట ♦ కెన్నొజన్మలనుండి యే
తెంచుచున్న ఋణంబుగాక ని ♦ దేయటంచు దలంచినన్
ఎంచలేనిది భక్తి నీపయి ♦ నేలగల్గు ప్ర॥

దారిజేర్చెడి వాడవంచు ప ♦ దంబునమ్మిన నేనెగా
భారమైతినె? బ్రోవకుండుట ♦ పాడియా? యిదియెంతరా
నేరమెంచకు సేవకంటెను ♦ నేరనేమియు సేయగన్
రార దాపున జేర్చిబ్రోవ పు ♦ రాణపుర్ష ప్ర॥

సారె సారెకు నీదునామము ♦ జాలఁజేసిన మేటి "మ
ద్దూరి"వంశపు జంద్రు"సాంబయ"♦దోసదూరు"యమాత్యుకుఁ
వీరమాతగు "కామయాంబకు" ♦ విశ్వమందున బుత్రుడఁ
పేరు పెద్దలు "పాపరావని" ♦ బిల్చు బ్రోవు ప్ర॥

మంగళంబు తవత్పదాబ్జము ♦ మానసంబున గొల్చు స
ద్వంగడుంబున కాల భూసుర ♦ వంశ కోటికి సాధ్వులా
మంగళాంగులకెల్ల దైవత ♦ మండలంబునకున్ సదా
మంగళంబు మహాత్మ నీకును ♦ మాననీయ ప్ర॥

సార్థకంబుగ వ్రాసితే నిది ♦ సంఖ్య వర్షములెంచగఁ
పార్థివందున మార్గశీర్షము ♦ భాస్కరాంకిత పక్షమున్
వార్థికంపు త్రయోదశందున ♦ వాసరంబిక రెంట బ్రే
మార్గతఁ గృతినిచ్చియుంటి న ♦ మామి దేవ ప్ర॥

సర్వము

సూర్యనారాయణార్పణమస్తు

